"శ్రీ శంకర భాష్యము"

→ ఈ ధర్మమును పరమేశ్వరుడు సృష్టి తో పాటే సమాజం లో
ప్రవేశపెట్టినాడు. సృష్టి ముందును, తరువాత ధర్మం రాదు. సృష్టి, ధర్మం
ఒకేసారి వస్తాయి. ఇప్పుడూ. ధరతి ఇతి ధర్మ: అంటే సృష్టిని తన position
లో నిలబెట్టేదానికి ధర్మం అని పేరు. Eg. భూమి సూర్యుని చుట్టూ తిరుగుతున్న
కోట. ధర్మ ఏమిటి Gravitational force అది ధర్మం అక్కడ. ఇప్పుడు
ముందు భూమిని సూర్యుని సృష్టించి తరువాత Gravitational force
సృష్టిస్తాడా? అలా ఉండదు. భూమి సూర్యుడు సృష్టించటంతో పాటు గానే
వాటి మధ్య ఆకర్షణ శక్తిని కూడా సృష్టిస్తాడు. అప్పుడే అవి నిలబడి
ఉంటాయి. లేకపోతే ధర్మమే లేకపోతే ఏదీ నిలబడి ఉండదు. ధర్మ శబ్దానికి
అర్థం అది. విస్తృతమైన అర్థాన్ని చెప్తారు.

→ ఆ ధర్మమే సమాజ ధర్మము, కుటుంబ ధర్మము, వ్యక్తిగత ధర్మము అలా
వస్తుంది. Anyway ఈ ధర్మాన్ని అందరూ అనుష్ఠించేవారు. మరీచ్యాదుల
మరీచి మొదలైన మహర్షులు, ప్రవృత్తి ధర్మాన్ని సనక సనందనాదులు
నివృత్తి ధర్మాన్ని లోకంలో ప్రవేశపెట్టారు. వారి వారి పూర్వ సంస్కారాలను బట్టి
కొంతమంది ప్రవృత్తిలో ఉండేవారు. కొంతమంది నివృత్తిలో ఉండేవారు. వారి
ధర్మాన్ని వాళ్ళు చేసేవారు. అది పద్ధతి. గృహస్థులు చక్కగా ప్రవృత్తి
ధర్మంలో ఉంటారు. ధనాన్ని సంపాదించటం, కుటుంబానికి రక్షణ ఇవ్వటం,
పన్నులు కడుతూ ఉండటం, పన్నులు కట్టాలి, పన్నుని ఎగవేత చేసే ప్రయత్నం
చేయకూడదు. పన్ను ఎంత కట్టాలో అంత కట్టేసేయాలి. ఎందుకంటే
ప్రభుత్వానికి పెద్ద డబ్బు ఉండదనుకోండి అది వాళ్ళకి ఇచ్చినట్లే పోతుంటే
వాళ్ళు దాన్ని పాడు చేస్తారు, లేకపోతే ఇంకోటి చేస్తారు అది వేరే సంగతి
మన వైపునుంచి మనం ప్రభుత్వానికి ఇచ్చే సొమ్ము ఏదైతే ఉంటుందో
అది వాళ్ళకి ఇచ్చేస్తుండటం. దాన్ని వెనక్కి లాక్కో పెట్టే ప్రయత్నం
అనవసరం. ఏదో దొంగ Receipts పెడుతుండటం. Suppose మీరు
false Receipt పెట్టి ఎంత save చేస్తారు? పది వందలలో మూడు
వందలో save చేస్తారు. దానికి save చేసామనే పేరు గానీ అది ఉంటుందా
పెట్టేదా? ఎలాగో ఖర్చు అయిపోతుంది కాబట్టి ప్రభుత్వానికి ఇచ్చే
సొమ్ము వాళ్ళకి ఇచ్చేస్తుండటం. ఇది ప్రవృత్తి ధర్మము.

→ ఇక నివృత్తి ధర్మము అంటే ఏంటి? శమము, దమాదులు.
శాంతో, దాంతో, ఉపరత, తితిక్షు: . నివృత్తి అంటే
ఇలా ఉంటుంది అని, ఒక ఆదర్శంగా నిలబడి ఉండాల సమాజానికి
నివృత్తి ధర్మం అంటే. ఇలాగ అందరూ చక్కగా అనుష్ఠించేవారు
దానికే కృతయుగము అని పేరు.

08:00 → కొన్ని కొంత కాలం అయినప్పటికి అది కలుషితం కాకొచ్చినది.
Eg:- Municiphality - Lorry - Magnet
09:00 → ఆరంభంలో బాగుంటుంది, క్రమ క్రమంగా కలుషితం అయిపోతుంది. అది
సమాజం యొక్క లక్షణం. కాలము ఆ స్థితికి తీసుకొస్తుంది. కాలానికి ఆ ప్రభావం
10:00 ఉంది. సం దీర్ఘమైన కాలేన చాలా కాలం అయ్యేసరికి అనుష్ఠాత్రుడైనను
కామోద్భవాలే: ధర్మాన్ని అనుష్ఠించేటప్పుడు రాగ ద్వేషాలు ఉండకూడదు
11:00 → కామ అంటే I like this, I dislike this (రాగ ద్వేషాలు) రెండింటికి కామ
అని పేరు. ఇది నా వద్దకు రావద్దు. ఇదే నా దగ్గరికి రావాలి రెండూ కామనయే గద
12:00 రాగము కామనయే, ద్వేషము కామనయే. ఈ రాగ ద్వేషాలు పుట్టేది ఎ
పిల్లలో. మామూలుగా అయితే అసలు రాగ ద్వేషాలు ఉండవు. రాగ ద్వేషాలు
Lunch లేకుండగా చక్కగా అనుష్ఠిస్తుంటారు.
→ అసలు ఉమ్మడి కుటుంబం మీరు ఊహించండి. ఎవరి పని వాళ్లు చేస్తుంటారు
13:00 ఇంతలో ఒక కోడలు వస్తుంది ఈ విభజనల ఉద్దేశ్య Etc అంటూ
తను చేస్తున్న కర్మ మీద ద్వేష భావము, ఇంకొకళ్ళు చేస్తున్న కర్మ మీద ప్రేమ
14:00 ఆ స్థితి వచ్చినప్పుడు పెద్ద వివేకవంతుడు అయితే ఒరే అన్నయ్య మనం
ఎవరి దారిన బతుకుదాం; ఇంక దెబ్బలాటలు అనవసరం లేకపోతేను అని తెలివితేటలు
15:00 ఉన్నవాళ్లైతే ఉన్న ఆస్తిని పంచుకుంటారు - Good will తో. విభాగం లో ఇచ్చి
పుచ్చుకోవటం ఉంటుంది లేదంటే ఇక Court.
16:00 → ఇదంతా కూడా కామ అనేదాంట్లో ఉంది. ఈ చేతనే కామన ఒకటి మనసులోకి
వచ్చేసిందంటే ఇంకపోయిందంతే విషం ప్రవేశించేసినట్టే. System లో.
17:00 Eg:- మన Politics



→ కామము అంటే రాగ, ద్వేషములు ప్రవేశించాయంటే ధర్మం పూర్తిగా కలుషితం
18:00 అయిపోతుంది. అది ప్రవేశించకుండా జాగ్రత్త పడాలి
Eg:- దేవాలయాలలో పడి ఉంటి కేసి. - Lawers of America
Eve. → రాగ ద్వేషములను అసలు picture లోకే రానివ్వకూడదు. వాడికంటే నేను
ఎక్కువ పని ఎందుకు చేసుకోవాలి? చేయాలి? అనే ప్రశ్న వేసుకోకూడదు
మనకి ఎక్కువ పని చేసే భాగ్యం లభించింది అని ఎక్కువ పని చేయాలి
అప్పుడు మీరు వేసుకున్నారా. In a given situation లో అయిపోయిందంటే
అక్కడితోటి ఆ శోభ పోయింది అంతే. "హాయమ్మా
దివి విచ్ఛిన్న హేతుకైన అధర్మం గా". మరి కామోద్భవాలే
మనసులో కామం ప్రవేశించిందంటే అంతే. "ఛిద్రం వదలాలి
కామిస్య. ఇత్యనర్థం లేమాను ఏదయ:" చిన్న సందు మీరు chance
ఇస్తే, కామ ప్రవేశిస్తుంది. కామం ఒకసారి ప్రవేశిస్తే ఇంక ఆ కామం లోపలికి

Priority Assignment

MAY 2019

| S | M | T | W | T | F | S |
|---|---|---|---|---|---|---|
| • | • | • | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | • |

వచ్చి ఆ చిన్న సందుని పెద్ద సింహ ద్వారం చేసి మొత్తం
మిగతా శత్రువులు అందరూ లోపలికి వచ్చేస్తారు. ఆ కామాన్ని అనుసరించి
" " ఎవరైతే ఉన్నారో, అంటే ఎవరు? క్రోధ, లోభ, మద, మోహ,
మాత్సర్యములు. ఈ మిగతా శత్రువులందరూ కూడా, open పెద్ద సింహ ద్వారం
చేసినందు ఈ కామః కోట గుమ్మం తెరిచేసినట్టు. అన్నీ వచ్చేస్తాయి.

→ ఏం వివేక విజ్ఞానము. ఇది ధర్మము, ఇది అధర్మము అనే విజ్ఞానం, ఇది
నిత్యము, ఇది అనిత్యము అనే విజ్ఞానము. మనం ప్రేమ కోసం డబ్బును విడిచి
పెట్టాం కానీ డబ్బు కోసం ప్రేమను విడిచిపెట్టవద్దు. ఇది వివేకం. డబ్బు నిత్యం కాదు.
ప్రేమ నిత్యము. ఆ ధర్మ, అధర్మ వివేక విజ్ఞానము, అది అలాగ చిక్కిపోతుంది
అసలు ఉన్నదే ఒక పిసరు. అది అలా క్షీణించిపోయి. పోయినా, రోజు రోజుకి క్షీణించి
పోతుంది. కామము ప్రవేశించిందంటే రోజు రోజుకి క్షీణించిపోతుంది. మీరు
రాగ ద్వేషాలు లేనప్పుడు ఎంత ప్రేమతో సేవ చేస్తారో ఒక్కసారి రాగద్వేషాలు
లోపలికి ప్రవేశిస్తే ఇంక రోజు రోజుకి మీరు చేసే సేవ తగ్గిపోతుంది, మీకు మీ
విసుగు బయల్దేరుతుంది అసహ్యం పుడుతుంది, ఇంక మీ వల్ల అవదు అంటూ

→ ఈ వివేక విజ్ఞానం అలా అలా క్షీణించిపోయి అధర్మం పెరిగిపోతుంది
కామము → వివేక విజ్ఞానము క్షీణించుట → అధర్మం పెరుగుట.

→ అధర్మం పెరుగుతే ఏమవుతుంది? ధర్మ అభిభవాయమానే - ధర్మం
తిరస్కరింపబడుచుండును. అధర్మం పెరిగిపోతే ధర్మం తిరస్కారాన్ని పొందుతూ ఉంటుంది

→ ధర్మాన్ని పట్టిన, చెప్పేవాడు వాడి జీవితంలో, చుట్టుపక్కల ఎవరైనా
ధర్మాన్ని పాటించే వారు కనపడితే వాళ్ళని త్రోసిపుచ్చు, ధర్మానికి ఎక్కడా
అవకాశం లేకుండా అయిపోతుంది. దాని వల్ల ఏమవుతుంది అధర్మ
ప్రవర్తమానే; అధర్మం ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోతుంది. ధర్మము బాగా
తగ్గిపోతూ ఉంటుంది. అంటే భగవద్గీత లో ఇలాంటి శ్లోకం ఒకటి ఉంది అది
మనసులో పెట్టుకొని అంటున్నారాయన. "యదా యదా హి ధర్మస్య ..."
ధర్మము చిక్కిపోతుంది - గ్లాని: అంటే చిక్కిపోవటం. ధర్మం చిక్కిపోతూ
అభ్యుత్థానమధర్మస్య, అధర్మము చిలవలు, పలవలుగా, మూడు పువ్వులు
ఆరు కాయలుగా పెరిగిపోతుంది. ఆ స్థితి అలాగే కొనసాగితే జగత్తు
నిలబడదు. ఎందుకంటే ధర్మము అంటే ధరతి ఇతి ధర్మః. ధర్మము సమాజ
వ్యవస్థని నిలబెట్టేది, కుటుంబ వ్యవస్థని నిలబెట్టేది వ్యక్తి యొక్క జీవితంలో
సమతౌల్యంలో నిలబెట్టేది ఆ ధర్మం. అధర్మం
మరింత, మరింత క్షీణించిపోతే ఇవన్నీ నశించిపోతాయి. ఏదీ
మిగలదు. అలా అవకూడదు. అలా అనుకున్నాడు భగవానుడు

Assignment | Priority

APRIL 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| 29 | 30 | • | • | • | • | • |

→ ఎందుకు అని నిన్నడు చెప్పండి? ఎందుకంటే సృష్టి చేసాడు ఇప్పుడు స్థితి చేస్తున్నాడు. స్థితి చేయుటం ఈశ్వరుని కర్తవ్యం. కాబట్టి స్థితి చేసే ఈశ్వరుడు, ఆ stage లో చక్రం అడ్డు వేస్తాడు. ఎక్కడో ఒక స్థితిలో చక్రం అడ్డు వేస్తాడు. అప్పుడు "జగతః స్థితిః పరిపాలనార్థః" జగత్తు యొక్క స్థితి, అంటే నిలబడుట. అది ధర్మాధీనంగా ఉంటుంది. ఆ ధర్మాధీనమైన జగత్తు యొక్క స్థితిని పాలించే కోరిక గలవాడై. సః భగవాన్ - ఆ పరమేశ్వరుడు. ఆదికర్త జగత్తును మొట్టమొదట సృష్టించినా ఉన్న ఆయనే సృష్టించిన వాడు వేరే అయినా, ఆయన స్థితి చేసేవాడు అదంతా కాదు. సృష్టించిన వాడే స్థితి చేస్తాడు. ఇదంతా నామమును బట్టి వచ్చిన Difference. రక్షించిన వాడే పాలనం చేస్తాడు. పేరు మారుతుంది. తత్త్వం మారదు. సః ఆదికర్త ఆ సృష్టికర్త, జగత్తుని మొట్టమొదట సృష్టించిన పరమేశ్వరుడు ఎవరు నారాయణాఖ్యో విష్ణుః అంటే నేను అంటాను వైష్ణవులలో అగ్రగణ్యులు ఎవరు? శంకరాచార్యుల వారు - విష్ణుః భక్తః వైష్ణవః

→ ఆ విష్ణువు - సర్వవ్యాపకుడయ్యినటువంటి ఆ పరమేశ్వరుడు, ఆయనకే నారాయణుడు అనే పేరు కూడా ఉంది. ఇంతకీ నారాయణుడు అనే పేరు ఎలా వచ్చింది ఆయనకి "నరాః అయనం యస్య" - నర ఏవ నారః నర అంటే ప్రాణి అని అర్థం, సకల ప్రాణుల యందు ఆత్మ చైతన్యము రూపముగా నివసించువాడు నారాయణః.

→ రక్షణార్థం, రక్షించుట కొరకై; దేనిని రక్షించుట కొరకు "భౌమస్య బ్రహ్మణః" భౌమస్య అంటే భూమి యందు అవతరించిన బ్రహ్మణః - వేదము యొక్క రక్షణ కొరకు. వేదము బ్రహ్మ అంటే. వేదం సృష్టికి పూర్వం ఎలాగ ఉంది, పరమేశ్వరుని యందు జ్ఞానము రూపముగ ఉంది. ఇప్పుడు తరా సృష్టి జరిగిన తరువాత భగవంతుడి ఉచ్ఛ్వాస, నిశ్వాసల రూపంగ వచ్చింది. ఆ వేద జ్ఞానాన్ని మరీచ్యాది ఋషులకు, సనక సనందనాదులకు ఆయన ఇచ్చాడు

→ ఆ వేద విజ్ఞానాన్ని రక్షించాలంటే ఎలా రక్షించటం? వేదం పుస్తకాలని print చేసి అన్ని Libraryలలో పెట్టటం కాదు. అలా రక్షించరు. ధర్మాన్ని రక్షించే పద్ధతి అది కాదు. మరి ఎలా రక్షించటం? ఆ ధర్మమును అనుష్ఠించేటువంటి వేదవేత్తలని రక్షిస్తే - బ్రాహ్మణత్వస్య రక్షణార్థం.

→ ఆ ధర్మాన్ని ఎవరు పాటిస్తున్నారో చూసి వాళ్ళకి స్థితిగతులు సరైన వ్యవస్థ చేసి, వాళ్ళు మళ్ళీ ఆ ధర్మాన్ని అలాగే పాటిస్తూ ఉండేట్లుగా వాళ్ళు ఈ ధర్మం పాటిస్తే మాకు తిండి కూడా దొరకటలేదు, మేము Auto నడుపుకుంటాం అని ఆ రకంగా వెళ్ళిపోకుండా ఈ ధర్మాన్నే పాటిస్తూ ఉండేటట్లుగా వాళ్ళకి ఏదైనా వ్యవస్థ చేస్తే వాళ్ళు ఈ ధర్మాన్ని రక్షించుకుంటారు. నిజంగా

→ అర్జునుడు అలాంటి ప్రలోభంలో పడిపోయి, తన కర్తవ్యాన్ని తానే విస్మరించే
మనస్థితికి చేరుకున్నాడు. భయం వల్లం, ఇంటి రాజ్యం, ఈ బంధువులు అందరూ
ఉన్నారు గనక నేను యుద్ధం చేయను అనే స్థితికి చేరుకున్నాడు. ఈ స్థితి particularly
భారత దేశం లో అసలు తగదు ఎందుకంటే India - Pak - (1965) మన బంధువులు
అందరూ అటు ఉన్నారు, మన Duty ఏమి భారత దేశం వైపు ఉండు
→ Arjuna's Argument ఇదే, చాలా wrong Argument it is All the way

"శ్రీ శంకర భాష్యం"

→ అంశేన కృష్ణః కిల సంబభూవ! - ఈ అంశేన చాలా చిత్రమైన ప్రయోగం
శంకరులు చేశారు. పౌరాణిక Ideas మనస్సులో ఉన్నాం మనకం. శం ఇలా అయన అంటారు
ఈ ధర్మమును రక్షించుట కొరకై - ధర్మమును రక్షించుట అంటే ధర్మిని రక్షించుట.
అది మనం గమనించాలి ధర్మాన్ని రక్షించటం అనేది వేరే ఏమీ ఉండదు.
Eg: Cricket (or) Hockey కి ప్రోత్సాహం - ఆటగాళ్ళకి ప్రోత్సాహం.
→ ధర్మశాస్త్రం పుస్తకాలని ఇంకా బాగా ప్రచురించి ఊరికే పంచిపెట్టాలని
అది కాదు ధర్మ రక్షణ అంటే, ధర్మం పాటించే వాడు ఎక్కడైనా ఉంటే, వాడు
ధర్మం పాటించటంలో ఆటంకం ఏదైనా ఉంటే, ఆ ఆటంకాలన్నింటినీ నివారణ చేసి
వాడి ధర్మాన్ని వాడు పాటించుటకు తగిన అవకాశం కలిపించాలి. అది ప్రభుత్వం
యొక్క ధర్మం. ప్రభుత్వం చేయాలి ఆ Duty. శం ధర్మిని రక్షించాలి. అందుకోసమని
ధర్మాన్ని రక్షించి, ధర్మానికి ఆటంకం కలిగించే వాళ్ళని అంటే దుష్టులను అని అంటారు.
శిక్షించటం కోసము. రక్షించటం రెండు Aspects
శిష్ట రక్షణ, దుష్ట శిక్షణ. ఈ రెండూ చేస్తే ధర్మం రక్షించబడుతుంది ఆ
ధర్మ రక్షణ కోసం భగవానుడు పుట్టాడు అని (పురాణాంశం - కిల).
→ దేవకీ, వసుదేవులకి శ్రీకృష్ణుడు జన్మించాడు - అంశేన సంబభూవ.
→ "బ్రాహ్మణత్వస్యహి రక్షణేన - - - - - - వర్ణాశ్రమా భేదానాం"
సమాజ ధర్మము, వ్యక్తి ధర్మము అని రెండు ఉన్నాయి. సమాజ ధర్మం లో వర్ణ
భేదాలు ఉంటుంది Eg: ఒక factoryలో finance, Research & technology, security, physical Labor. సాధారణంగా ఈ నాలుగు రకాల
వాళ్ళు ఒకళ్ళతో ఒకలు దెబ్బలాడు కుంటారు.
co-ordination ఉండదు. తరువాత వాళ్ళలో వాళ్ళకి, ఈ దెబ్బలాట
కి హేతువు ఏమిటి అంటే ఒకళ్ళమీద ఒకళ్ళకి అసూయ
ఉంటుంది Eg: Weakly Coordination Commety meeting
finance, technology, security, labor Head

→ ప్రతీవాడు ఏమనుకుంటాడంటే నేను చేసే పని అన్నింటికంటే కష్టమైనది
అవతలివాడు సుఖపడిపోతున్నాడు అని అసూయనే ప్రధానంగా కనపడుతుంది
→ సమాజ జీవనంలో ప్రధానమైనటువంటి వర్ణములు ఉంటాయి వాళ్ళ బాధ్యతలో
బాధ్యత్లు కొట్లాడుకుంటూ, తప్పుకుంటూ ఉంటే సమాజ జీవన పద్ధతి కాదు అది
కాబట్టి you do your duty to the best of your ability దీన్ని
వర్ణ ధర్మము అంటారు - సమాజం Level లో ఉంటుంది.
→ ఇంక ఆశ్రమ ధర్మము - వ్యక్తి Level లో ఉంటుంది. కాబట్టి వర్ణాశ్రమ ధర్మము
అని మనమనేటప్పటికి సమాజము, వ్యక్తి రెండు Levels లో కూడా ధర్మాన్ని
settle చేసినట్లవుతుంది. ఇది this is the structure. Vedic కాలంలోని
Structure ఇది - వ్యవస్థ అని అంటారు, ఈ వ్యవస్థ, అవ్యవస్థ కింద మారిపోయి
ఈనాడు, No more such organization & order Exist. Therefore
Historic గా మనం దాని గురించి తెలుసుకోవాలంటే, You neighter critisize it
nor you support it Because you దాన్ని Abuse చేయాల్సిన
అవసరం లేదు. ఎందుకంటే History లో a given point of time లో it has
its own message & its own value & there is a spirit in
it you should take this spirit, you need not bother about letter
If you start abusing it you will miss the spirit, thats why dont
abuse it Dont support it ఎందుకంటే దీనికి support చేయాల్సిన
స్థితిలో లేదు అది. వ్యవస్థని Support చేయాలి కానీ అవ్యవస్థని
support చేయకూడదు. It is no more a వ్యవస్థ. కేవలం మనకి ఉన్న
బూజు పట్టిన భావాలతోటి Support చేయాలి అనుకుంటే, Otherwise
there is nothing to support in it. ఈనాడు సమాజంలో ఒకే ఒక
వర్ణం ఉన్నది ఏమిటంటే వైశ్యులు. అందరూ వైశ్యులు గానే ఉన్నారు.
Everybody బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ, శూద్ర - is a business man
అందరికీ డబ్బే ప్రధానంగా, అందరూ వైశ్యులుగానే ఉన్నారు Eg = గుడిలో
పూజారి Labourer, Intellectual (బుద్ధి జీవి) (one who Encashes
his knowledge - బుద్ధి జీవి) Knowledge ని Encash చేయడం.
అంత దోషం అది దాన్ని ఇంకొకటి లేదు. మన శాస్త్రాలు If there is one
thing that you can never Encash is knowledge
Knowledge ని Cash రూపంగా దర్శించే ప్రయత్నం చేసినట్లైతే
అది వేద ధర్మానికి విరుద్ధం అది. కానీ ఈనాడు Knowledge
ని Cash చేసుకొని బ్రతికేస్తున్నారు "నిష్కారణో షడంగో వేద:
అధ్యేయ: జ్ఞేయశ్చ" అని బోధాయన, ఆపస్తంబ మొదలగు మహర్షులు చెప్పారు

→ వేదములను, వేదాంగములను నీవు నిష్కారణంగా చదువుతో. ఉబ్బు అనే Point
మనసులో పెట్టుకోవద్దు, ఉబ్బు కానీ, ప్రతిష్ఠ కానీ, position కానీ ఇటువంటి
ఒక లౌకిక ప్రయోజనాన్ని ఆశించి ఎన్నడూ వేదాన్ని, వేదాంగములను అధ్యయనము
చేయవద్దు అని మనకి బోధించారు. It is possible

→ Eg: B.A. చాలా గొప్పది అని ఈ స్థితిలో వ్యవస్థని support చేయవద్దు
→ Dont abuse also whatever the spirit you take - Spirit ఇది
మాత్రం "Do your Duty" - అది మారదు. వర్ణాశ్రమ వ్యవస్థ మారిపోయిందిగానీ
"Do your Duty" ఆ మాట మారదు. That is the spirit of వర్ణ, ఆశ్రమ.

→ ఓ సారి ఈ చర్చ వచ్చింది. ఆ spirit మీరు తీసుకోకుండా Letter
తీసుకున్నారనుకోండి, నేను ఏమని చెప్తానంటే మీరు Letter తీసుకునే పక్షంలో
ఈ Letter is the teaching of భగవద్గీత అని మీరు అనుకుంటే, మీ
భగవద్గీత పుస్తకాన్ని మీరు మడతపెట్టి ఇంట్లోనే పెట్టుకోవచ్చు, అక్కర్లేదు. Nobody
wants it, Nobody needs it. If you are willing to take the
spirit of it Entire Humanity will benifit out of it.

→ కాబట్టి వర్ణ, ఆశ్రమ, ధర్మానాం - ఈ పదాలని మీరు ఒక orthodox viewpoint
లో చూడొద్దు. వర్ణ - అంటే సామాజిక ధర్మము, ఆశ్రమ - వ్యక్తిగత ధర్మము.

→ వ్యక్తికి కూడా ధర్మాలు ఉన్నాయి. బ్రహ్మచర్యాశ్రమము, అనే ఒక ఆశ్రమము
దీనితో సమాజానికి ఏం సంబంధము లేదు. నేను బ్రహ్మచారిని, కాబట్టి శ్రద్ధగా
చదువుకోవాలి. అదేవిధంగా మీరు బ్రహ్మచారిని encourage చేయాలి. తల్లిదండ్రులు.

→ తరువాత గృహస్థాశ్రమము - గృహస్థాశ్రమ ధర్మాలు ఏమిటి? గృహస్థాశ్రమములో
మనిషికి కొన్ని special privilages ఉంటాయి. Very special privilages Eg
రాగ ద్వేషాలు - you can Entertain certain, the field is open Eg:- విహారయాత్రలు
in Summer etc, కామ్యాలు. Wonderful privilages, very special
privilages, But duties also. Indian constitution లాగ, Rights ఉంటాయి
Duty ఉంటాయి.

→ గృహస్థాశ్రమ ధర్మాలలో (Duties లో) మొట్టమొదటి Duty - అతిథి ధర్మము
మనవాళ్ళు first ని పెట్టారు అది. కానీ ఇప్పుడు modern మనవాళ్ళు గృహస్థులు
ఎలా ఉంటారంటే (Nuclear families అయిపోయాయి) They dont want to
Cook one grain extra & Nobody is willing to
share food with others. గృహస్థు అన్నవాడు ఎప్పుడూ కూడా
He should be willing to share food with others that
is the fundamental ధర్మం. Very fundamental

Wk. 18 Workers' Day (International Labour Day)

→ మీ డబ్బు మీరు ఎవల్లకీ ఇవ్వద్దు, ఖర్చు చేసుకోండి. జాగ్రత్తగా Invest చేసుకోండి, జాగ్రత్తగా దాచుకోండి, కానీ food మట్టుకు you should share with people & with Animals also. Animals ని పెంచమని సలహా కాదు. కానీ share the food with them

→ ఇంట్లో వండిన అన్నానికి ప్రభువు మీరు కాదు, వండక ముందు It is yours వండిన తరువాత ఎవ్వరిది అవుతుంది? యతి, బ్రహ్మచారి వీళ్లు ఇద్దరు ఉంటారు. వీరు కాక సన్యాసి ఉంటారు వాళ్ళకి పెట్టిన తరువాతే మిగిలింది మనది కాబట్టి బియ్యం మీది, అన్నం యతిది. ఆవిధంగా ఆతిథ్య ధర్మం చాలా ప్రసిద్ధం

→ వానప్రస్థం - ఇంక జీవితాంతం గృహస్థుగా ఉండకూడదు వానప్రస్థునిగా జీవించాలి. వానప్రస్థుని లక్షణం ఏమిటంటే ① you will not earn anymore. ఇంతకు ముందు సంపాదించింది ఏదో Invest చేసుకొని ఆ Investment మీద వచ్చిన దానితో తృప్తిగా బ్రతకటం. కొత్తగా Earning అనేది ఒక Compititive life style ని పెట్టుకోకపోవటం. ② విరక్తంగా ఉండటం తపస్సుకి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి, శమ దమాదులకి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి కుటుంబ వ్యవహారాలలో కలగజేసుకోకుండా విరక్తంగా ఉండటం. ఇది వానప్రస్థం

→ అటువంటి సందర్భం వచ్చినట్లయితే, వైరాగ్యం నిండా ఉన్నట్లయితే, పరిస్థితులు అనుకూలించినట్లయితే, ఎవల్లకీ కష్టం లేని స్థితిలో సన్యాసం that is the ultimate

→ సో ఇవి నాలుగు ఆశ్రమాలు వ్యక్తిగత జీవనంలో. సో మనకి when you take yourself part of the society అప్పుడు మీ నెత్తి మీద Social ధర్మం అనేది ఉంటుంది దాన్ని మీరు ఆచరించాలి మీరు ఒక వ్యక్తిగా మిమ్మల్ని మీరు స్వీకరించినప్పుడు మీకు ఒక వ్యక్తిగత ధర్మం ఉంటుంది దాన్ని మీరు ఆచరించాలి Eg: Road మీద వెళితే Car Left side నడపాలి; అది Social ధర్మం, వ్యక్తిగా మీరు సంపాదించిన దానికి Tax కట్టాలి అది వ్యక్తి ధర్మం. ఒకటి వర్ణ, ఇంకొకటి ఆశ్రమ. వర్ణాశ్రమ ధర్మాలు అంటే ఇవి

→ సో ఈ ధర్మములు వ్యక్తిగత ధర్మము, సమాజ ధర్మము అని ఈ రెండూ కలిస్తేనే పూర్ణ ధర్మం అవుతుంది. ఈ ధర్మం యొక్క స్వరూపాన్ని నిర్ణయించటానికి వేదము ఉన్నది. వైదిక ధర్మ:

→ వేదవ్యాసులు చేసిన ఆ వేదముల యొక్క సారాన్ని తెలుసుకొని ఆ వ్యక్తిగత ధర్మాన్ని

Assignment సమాజ ధర్మాన్ని పాటించే Priority వైదికుడు ఎవరైతే ఉంటాడో

ఆ వైదికుని రక్షించినట్లయితే వేదోక్తమైన ధర్మాన్ని రక్షించినట్లవుతుంది

→ కాబట్టి ధర్మ యొక్క రక్షణే ధర్మ రక్షణ, ఆ ధర్మం అన్నది వ్యక్తిగత ధర్మము, సమాజ ధర్మము అని రెండు రకములు అని that is the Spirit of Entire thing

MAY 2019

| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | 31 | • | • |

ప్రమేయము = Subject Matter



• → తరువాత "స చ భగవాన్ జ్ఞానైశ్వర్య శక్తి బల వీర్య తేజోభిః
సదాసంపన్నః: - - - - - - - - - - లోకానుగ్రహం కుర్వన్ ఇవ లక్ష్యతే"

→ స చ భగవాన్ = ఆ శ్రీకృష్ణ భగవానుడు. అని అన్న వెంటనే, భగవాన్ అనే
పదానికి Definition ఇచ్చేసాడు. ఏమని "జ్ఞానైశ్వర్య శక్తి బల తేజోభిః సదాసంపన్నః"
ఈ Definition ఒక శ్లోకంలో కూడా ఉంది. - - - -

→ ధనవాన్ అంటే ధనం కలవాడు. కలవాడు అనే అర్థంలో వాన్ వస్తుంది అలాగే
భగవాన్ అంటే భగము కలవాడు. Then what is భగ?. భగ అంటే
ఆరు గుణములు అని అర్థం. ఏమిటంటే తెలుసునా ఆరు గుణములు,
ఇవి ఉన్నాయి జ్ఞాన, ఐశ్వర్య, శక్తి, బల, వీర్య, తేజస్సు. ఈ
ఆరు గుణములు కలవాడు. ఏదో కొద్ది కొన్ని ఈ గుణాలు అందరిలోనూ ఉన్నాయి
మరి అందరూ భగవానులేనా? అవును.. ఈశ్వరుడు జీవుడు. Anyway ఇద్దరికీ
వ్యవహారికంగా ఒక భేదము అంగీకరించి ఈ ఆరుగుణములు భగవానునిలో
పూర్ణముగా ఉంటాయి, నిత్యముగా ఉంటాయి సదా సంపన్నః. సదా అంటే నిత్యము
సంపన్నః అంటే పూర్ణము అని అర్థము. ఏమిటి ఆ గుణాలు

1) జ్ఞానము - ఈశ్వరుని యందు సర్వ జ్ఞానము ఉంటుంది. ఎందుకంటే
సర్వమును సృష్టించాడంటే సర్వ జ్ఞానము ఉండాలి కదా. Eg ÷ ఇంటి
Architect కి ఇల్లు మొత్తం తెలుసు కదా. అలాగే అన్ని Departments జ్ఞానం ఉండాలి

2) ఐశ్వర్య = అంటే ప్రభుత్వము Eg ÷ Surpanch, chief minister, prime minister
whereas భగవానుడు అందరికంటే పైన ఉండే ఈశ్వరుడు. ఈ ఈశ్వర

3) భావము దానికి ఐశ్వర్య అని పేరు ఈ విధంగా ఇంకో నాలుగు ఉన్నాయి

35 వ శ్లోకం ÷

"ఓ మధుసూదనా! (మధు కైటభులనే రాక్షసులను సంహరించిన వాడా!. మధు
కైటభులు రాగ ద్వేషములకు ప్రతీకలు). నన్ను చంపుచున్నా (కొడుతున్నా) నేను
వీరిని చంపుటకు (తిరిగి కొట్టుటకు) ఇష్టపడను. ముల్లోకముల రాజ్యము కొరకే
ప్రయోజనము కొరకైన నేను వీరిని సంహరించను. ఇక భూలోక రాజ్యం గురించి
సంహరించనని వేరుగా చెప్పవలయునా? (అక్కరలేదు)

శ్రీ శంకర భాష్యము

1) జ్ఞానము = ఈశ్వరుడు సర్వమూ తెలిసిన వాడు. సర్వము సృష్టించినవాడు కనుక సర్వమూ తెలిసినవాడు, అంటే అభిప్రాయం - ఎక్కడో ఒక చోట కూర్చొని ఉన్నాడు ఒకాయన ఆయన తెలుసుకుంటుంటాడు అని, some super computer Brain లాగ అలా భావన ఇది కాదు అభిప్రాయం. అభిప్రాయం ఏమిటంటే ఈశ్వరుడు అంటే cosmic person అదేమిటో గుర్తించాలి, universal person. There is no Universal person, there is only universal power & Universal Intelligence. ప్రత్యేకంగా universal person అంటూ ఏం లేదు అక్కడ universal power & Universal Intellegence ఉంది But still for the purpose of relating we call it universal person Eg:- Company registration & treated as person

→ అదేవిధంగా universe మనం చూస్తున్నట్లయితే It is full of power & intellegence, Eg:- భూమి సూర్యుని చుట్టూ తిరగటం. - power & Intellegence

→ మనిషి అంటే ఏమిటంటే power, Intellegence ఉన్నవాడు మనిషి, అలాగే In the Universe, there is power & there is intellegence, therefore we posit a person. Person అక్కడ లేదు, ఇక్కడ లేదు, Individual లేదా person లేదు, universal లేదా person లేదు. ఉన్నది కేవలము power & intellegence (or) a source for these two. దానికి బ్రహ్మ అని పేరు, ఆది శక్తి అని పేరు - వేదాంతం అంతా అలాగే చెప్పారు.

→ ఇక్కడ ఉన్న power ని, ఇక్కడ ఉన్న Intellegence ని ఒక person గా మనం తీసుకుంటున్నాము గనుక, Universal power & Universal Intellegence ని Let us take as a person to start with. ఆ person కి Cosmic person అని పేరు ఆయనకే దేవుడంటే. ఇప్పుడు దేవుడు సర్వజ్ఞుడు అంటే అర్థం అన్నీ తెలుసు అంటే ఎక్కడో ఒకాయన supercomputer లా అన్నీ తెలుసుకుంటాడు అని కాదు. Eg:- Google

→ ఈశ్వరుడు cosmic person. Cosmic Intellegence is ఈశ్వర's intellegence అంటే అదే జ్ఞానం.

② ఐశ్వర్య = ఈశ్వరభావః = ఈశ్వర భావః అంటే ఈశ్వర శబ్దానికి అర్థం ఏమిటంటే - నియామక శక్తి - Controlling power so ఈశ్వరుడు at the atom level, subatomic particle Level లో ఎంత perfect control అంటే Electron ఉండాల్సిన చోట Electron ఉంటుంది అలాగే protin ఎక్కడ ఉండాలో అక్కడ ఉంటున్నాయి అక్కడ ఉంటాయి. ఎలా Behave చేయాలో

అలా Behave చేస్తాయి. ఒక్క Human Being తప్పించి అన్ని systems కూడా perfect గా Behave చేస్తాయి. కాబట్టి ఐశ్వర్య- ఈశ్వర భావం: అంత నియమితంగా అన్నిటి perfect నియమాలను ఉంటుంది In every Area.

3) శక్తి - power

4) బలం -

ఈ శక్తిలో కూడా రెండు variety ఏమిటంటే సూక్ష్మమైన శక్తి, స్థూలమైన శక్తి. సూక్ష్మ శక్తి - Eg:- వాయు ప్రవాహం, Gravitational pull etc స్థూలమైన శక్తి అంటే Mechanical Energy - ఈ భూమి ఇలా సూర్యుని చుట్టూ తిరగటం ఇదంతా Mechanical Energy లోకి వస్తుంది

5) వీర్యము = రక్షించే సామర్థ్యము ఈ ఇవన్నీ Interrelated But still there is a difference Eg:- మనిషి ఉంటాడు సూక్ష్మంగా ఆలోచించే శక్తి ఉంటుంది. సూక్ష్మ శక్తి. తరువాత physical గా కూడా బరువులు ఎత్తే శక్తి ఉంటుంది తరువాత ఇవి రెండూ ఉంటే చాలదు. ఎవరినైనా రక్షించే ఎదుటివాళ్ళకి Help చేయాలనే పెద్దమనసు, ఆ సామర్థ్యము, అది ఉండాలి పరిస్థితులని గుర్తించి అది పూర్ణముగా స్ఫురించి. వీర్యము అంటే రక్షణ శక్తి.

6) తేజస్సు అంటే ప్రకాశము. ఎటువంటి ప్రకాశము? దృష్టి ప్రకాశము, సూర్య, నక్షత్రములలో ఉండే ప్రకాశము, చైతన్య ప్రకాశము ఇవన్నీ కూడా, ఈ లక్షణాలు అన్నీ కూడా నిండి ఉన్నాయి కనుక సదా సమగ్ర:- అన్ని కాలములలో నిండి ఉన్నాయి. సమగ్ర: అంటే నిండి ఉండటం ఈ లక్షణాలు. అలా ఉన్నటువంటి ఆ Universal person కి భగవానుడు అని పేరు. ఇప్పుడు ఈ భగవానుడు, సర్వ వ్యాపకుడు Universal person ఒక చోట పుట్టాడు - అవతారం ఒక చోట పుట్టాడు అంటే, few things should be clearly understood, భగవానుడు ఒక చోట పుట్టాడు అంటే ఇంత Universe లేకుండా పోయిందా? కాదు: Universal person, Universal power అలా అలా Maintain అవుతూనే ఉంది మరి అలా Maintain అవుతూ ఇక్కడ పుట్టాడు అని ఎలా అంటాం? అక్కడ ఉన్న వస్తువు ఇక్కడికి వచ్చింది అని చెప్తాం. సర్వ వ్యాపకుడు వచ్చాడు అని ఎలా చెప్తాం! అక్కడ ఉన్న ఆకాశం ఇక్కడికి వచ్చింది అని చెప్తామా మనం? చెప్తాం. ఎందుకని Eg:- ఘటము - అందులోని ఆకాశం, Atmosphere

Assignment Priority

MAY 2019
| M | T | W | T | F | S | S |
|---|---|---|---|---|---|---|
| • | • | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | 31 | • | • |

→ ఈశ్వరుడు సర్వ వ్యాపకుడు - ① - ఈశ్వరుడు పుట్టినాడు - ②
ఈ రెండింటిని How you Reconsile? పుట్టడం అంటే ఎక్కడో పుట్టాడో
అక్కడే ఉన్నాడు అంతటా లేడు. సర్వవ్యాపకుడు అంటే అంతటా ఉంటాడు కానీ
ఎక్కడో ఒక చోట ఉండటం సంభవం కాదు. How? అంటే తన మాయయా
→ ఇప్పుడు మాయ అనేది అవసరమైనది, మాయ అనేది It is a necessity
without మాయ - you cannot take one step forward కొందరికి
మాయ - They dont like the word మాయ అనేది శంకరుడు పెట్టింది
కాదు. అది ఆ ఉపనిషత్ లో ఉంది, శాస్త్రంలో శంకరుని పూర్వం నుంచి ఉంది అనే
మంత్రములోనూ ఉంది. దానిగురించి ఏమి చింత చేయటం అనవసరం. కానీ కొంత
మందికి ఆ మాయా పదం ఇష్టం లేక దాన్ని కొంచెం బద్నామ్ చేసే ప్రయత్నం
చేసి ఏదో మాట్లాడారు

→ మాయకి Definition ఏమిటంటే - అఘటిత ఘటనా
పటీయసీ మాయా - ఏది ఘటిల్లడానికి వీలు లేదో దాన్ని ఘటిల్లునట్లు
చేసేది మాయ - ఘటిల్లడము అంటే సంభవము అగుట. so ఏది
ఘటిల్లడానికి వీలు లేదో దాన్ని ఘటిల్లునట్లు చేసేది. ఇప్పుడు ఈ మాయ
కి, ఈశ్వరునికి, జీవునికి సంబంధం ఏమిటి? మాయకి వశుడైనా
ఇబ్బంది పడుతుంటాడు జీవుడు. మాయని తన వశంలో పెట్టుకొని
ఒక ఆట ఆడిస్తుంటాడు ఈశ్వరుడు.

→ స్వమాయయా - తన మాయ చేత. ఇప్పుడు ఈశ్వరుడు నిజంగా
ఒక చోట పుట్టి పోతుంటారా? లేదు. అలాగని అసలు పుట్టకే లేదంటారా?
అవతారమే లేదంటారా? అది లేదు. దీనికి వేదాంతంలో ఒక Technique
ఉంది to handle this, to Reconsile this. ఆ technique
ఏంటంటే ఇవ. దేహవాన్ ఇవ. దేహము కలవాడు వలె. ఇవ వేసుకుంటే
అన్నీ సరిపడుతాయి. Eg:- Movie screen

దృష్టాంతే నటుడు అన్నీ, కనబడుతోంది, కనబడుతుందంటే అనుభవానికి
వస్తుంది అని అర్థం. కనబడుతుంది కానీ వాస్తవంగా లేదు. అదేవిధంగా
సర్వ వ్యాపకుడైన పరమేశ్వరుడు ఒక చోట ఒక దేహమునకు కట్టుబడి ఉన్నాడు
అని అనకూడదు. ఒక చోటు ఒక దేహమునకు కట్టుబడి ఉన్నట్లుగా కనబడుతున్నాడు.
వాస్తవంగా కట్టుబడి లేడు.



→ దీన్ని మనము నలుపెట్టలంటే వేదాంతంతో Reconsile
చేయగలరు. Eg:- [illegible]

→ దేహవాన్ ఇవ – దేహము గలవాడు వలె – జాతః ఇవ – పుట్టినవాడు వలె. లోకానుగ్రహం కుర్వన్ ఇవ – ఇప్పుడు దుష్టులు, శిష్టులు అని ఉన్నారు. దుష్టులను శిక్షిస్తాడు దేవుడు, శిష్టులను రక్షిస్తాడు. దుష్టుల ఆత్మ స్వరూపులే, శిష్టులు ఆత్మ స్వరూపులే, ఈశ్వరునికి భిన్నంగా ఏదీ లేదు Universal power లో ఇది ఉత్కృష్టమైనది, అది అపకృష్టమైనది. ఎవళ్ళ ఎవళ్ళని శిక్షిస్తున్నట్టు, ఎవళ్ళని రక్షిస్తున్నట్టు? కాబట్టి – లోకానుగ్రహం కుర్వన్ ఇవ అంతా సినిమా తెర మీద నడిచినట్టే.

→ లక్ష్యతే – అసి – అని అనరాయన లక్ష్యతే – అలా కనబడుతున్నారు. అది ఆయన ఈ అవతార వాదములు అన్నీ settle చేసి పెట్టారాయన. ఇది అవతార వాదము లో Topic ఇది

→ మాయను తన వశం చేసుకుంటే ఈశ్వరుడు అవుతాడు, మాయకు వశుడైతే జీవుడు అవుతాడు. కాబట్టి ఈశ్వరుని గురించే మాట్లాడు-తున్నాం గనక, మాయని తన వశం చేసుకున్నవాడు. అయితే ఈ జగత్తు, కంతటికీ మూల పదార్థము, మూల ప్రకృతి ఏమిటి?

→ ప్రకృతి. కి పాణిని మహర్షి – 'జని కర్తుః ప్రకృతిః' – అనే ప్రకృతికి Definition
Eg: వర్షానికి – మేఘము, మేఘానికి ప్రకృతి సముద్రము
అలాగే ఈ జగత్తుకి ప్రకృతి ఏమిటి? అంటే that Universal power & Universal Intelligence రెండూ కూడా కలిపి శక్తి అదే Universal power & Intelligence అదే ఆ మూల ప్రకృతి. ఇప్పుడు సూర్యుడు గొప్ప తేజోమండలము. ఈ సూర్యుడు అనే తేజోమండలం ఎక్కడినుంచి వచ్చింది? Universal power నుంచే వచ్చింది అలాగే stays

→ Universal power is two fold one is power – శక్తి. second is విజ్ఞాన శక్తి. నే క్రియా శక్తి అంటారు, విజ్ఞానం కూడా power అది కూడా శక్తి కాబట్టి దాన్ని విజ్ఞాన శక్తి. ఈ క్రియా శక్తి, విజ్ఞాన శక్తి, ఈ శక్తులన్నీ కూడా అక్కడా, ఇక్కడా సర్వ వ్యాపకంగా ఉన్నాయి వీటి అన్నింటికీ మూలంలో ఉన్న మహా శక్తి, ఆ మహా శక్తి ఎవరి వశంలో ఉంటుందో ఆయన ఈశ్వరుడు ఆ మహా శక్తి కి లోబడి మనం జీవిస్తున్నాము, మనం జీవులము

→ కాబట్టి ఈ జగత్తు అంతా కూడా ఆ మహా శక్తి నుంచే ఆవిర్భవించింది

Assignment కాబట్టి ఆ మహాశక్తి Priority కి మూల ప్రకృతి అని పేరు. ఈ మూల ప్రకృతి ని తన అధీనంలో పెట్టుకున్నవాడు ఈశ్వరుడు. ఆయన ఎటువంటివాడు – భగవాన్ – ఆయన ఎక్కడ ఉంటాడు – సర్వ వ్యాపకుడు.

MAY 2019

| M | T | W | T | F | S |
|---|---|---|---|---|---|
| • | • | 1 | 2 | 3 | 4 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 27 | 28 | 29 | 30 | 31 | • |

→ ఇంట్లో రహస్యం ఏమిటంటే శక్తిమంతున్ని మీరు శక్తి నుంచి విడదీయలేరు. శక్తి ఎక్కడ ఉంటుందో శక్తిమంతుడు అక్కడ ఉంటాడు. Ex:- నిప్పు - కాల్చే శక్తి. నిప్పు ఎక్కడ ఉంటుందో కాల్చే శక్తి అక్కడే ఉంటుంది కానీ మనకి ఏమనిపిస్తుందంటే రెండూ వేరు వేరు లాగా అనిపిస్తుంది వేరు వేరుగా ఎందుకు అనిపిస్తుందంటే మనం వేరు వేరు శబ్దాలని ప్రయోగిస్తున్నాం. అందుకని అలా అనిపిస్తుంది. ఒకప్పుడు కంటికి కనపడేటప్పుడు కూడా అలా అనిపిస్తుంది ఒకప్పుడు కంటికి కనబడేటప్పుడు కూడా అలా అనుకోవచ్చు. నిప్పు అక్కడ ఉంది, వేడి ఇక్కడ తగులుతోంది అని మనం అనుకోవచ్చు. కానీ వాస్తవంలో నిప్పు అంటే వేరుగా కల్పితం కాదు. నిప్పంటే వేడికే నిప్పని పేరు పెట్టి, వేడి ఎక్కడ తగిలితే అక్కడ నిప్పు ఉన్నట్టే నిప్పు ఎక్కడ ఉంటే అక్కడ వేడి ఉన్నట్టే రెండింటినీ విడదీయలేరు అలాగ. కానీ అగ్ని: దాహక శక్తి: - అగ్ని అంటే వేడి అనే శక్తి అని విడదీస్తారు. విడదీసి మాట్లాడడం వల్ల. Therefore Difference వస్తుంది. విడదీసి మాట్లాడినప్పుడు Difference వస్తుంది. There is no real difference. it is purely verbal difference. His power అంటారు. అంటే He వేరు, power వేరు అనా? No. only verbal difference. He is the power, power is He అదేవిధంగా ఆ పరమేశ్వరుడికి ఉన్న మాయా శక్తి. పరమేశ్వరుడు ఎక్కడుంటే మాయాశక్తి అక్కడ ఉంటుంది. మాయాశక్తి ఎక్కడ ఉంది జగత్తు అంతా వ్యాపించి ఉంటుంది. పరమేశ్వరుడు కూడా జగత్తంతా వ్యాపించి ఉంటాడు. అందుకనే ఆ ఈశ్వరుడికి విష్ణు: అని పేరు. ఆ శక్తికి వైష్ణవీ శక్తి అని పేరు. విష్ణు: అనే పదాన్ని ఒక Individual కి Apply చేసే సంప్రదాయాన్ని మనం  Gradual గా వదిలిపెట్టాలి. It is not Mr. Vishnu / Mr. Shiva Vishnu - సర్వవ్యాపక: ఈశ్వర:, శివ: మంగళకర: ఈశ్వర: ఇప్పుడు ఎంతమంది ఈశ్వరులు అయ్యారు! ఒక్కడే ఈశ్వరుడు. ఈశ్వరునికి లక్షణాలు రెండు అయ్యాయి కానీ ఈశ్వరుడు ఒక్కడే. రెండు కాలేదు. ఈ సత్యాన్ని సమాజంతో బోధించటం కూడా కష్టం అవుతుంది.

→ Any way వైష్ణవం. స్వాం మాయాం - తన మాయని తన వశంలో పెట్టుకున్నాడు

→ శ్రద్ధగా శ్రోత్రం:- ప్రతి పదాన్ని స్పష్టంగా తెలుసుకోవాలి

ఇది పెద్ద, చాలా Important point

→ త్రిగుణాత్మికా మాయా - ఈ మాయ ఉంటే, త్రిగుణాత్మికా,
ఈ మాయ ఉన్నట్టా, లేనట్టా? ఈశ్వరునికి ఈశ్వరుని శక్తికి
భేదం లేదు అన్నారు. ఈశ్వరుడు ఉన్నప్పుడే శక్తి ఉంది ఈశ్వరుడు
లేకపోతే శక్తి లేదు. ఇంతకీ ఈశ్వరుని కంటే వేరుగా ఉన్నట్టా లేనట్టా?
లేనట్టే. మరి ఉన్నట్టు ఎందుకు మాట్లాడుతున్నారు? To explain a
few things. యా - మా - స మాయా: యా - ఏదైతే మా - కాదు
జగత్తుకు మూల ప్రకృతియై అది మాయా, ఈశ్వరునికంటే భిన్నంగా
ఏది లేదో అది మాయా. (త్రిగుణాత్మికా మాయ గుణములు
స్వరూపముగా గలది, అన్ని అంటే, స్వరూపము. ఏమిటా గుణములు
సత్వ, రజ, స్తమో గుణములు. అంటే ఏమిటి? why 3, why not 2?
→ ఇప్పుడు ఈ మాయా శక్తి నుంచే ఈ జగత్తు ఎలా ఆవిర్భవించింది కదా
ఎప్పుడైనా కూడా కారణం గురించి మీరు ఏదైనా తెలుసుకోవాలంటే కార్యం
బట్టి కారణం గురించి తెలుసుకోవాలి. Eg + బంగారు నగ ఉంది - పచ్చగా
మెరిసిపోతూ ఉంటుంది. ఎందుకు - Necklace పచ్చగా మెరుస్తుందా లేదా? yes
కాబట్టి బంగారం కూడా పచ్చగా మెరుస్తూ ఉంటుంది లోహము? - ఎందుకంటే Necklace
కూడా లోహం, కాబట్టి. కార్యాన్ని చూసి మనం కారణం తెలుసుకోగలుగుతాం.
→ అదేవిధంగా మీరు జగత్తుని చూస్తే, జగత్తులో you have to reduce it
Generalise చేసి Reduce చేసుకోవాలి. జగత్తుని మీరు Reduce చేస్తే,
you can reduce it to 3. Vedantic Generalizations - Swami Vivekananda
→ Swami Vivekananda అంటే Vedantic G (వేదాంత) గారు అంతో కూడా చెప్పించు-
-కున్న మనిషి. అటువంటి మనిషి ఏదైనా మాట మాట్లాడితే దానికి చాలా
బలం వస్తుంది. దాంట్లో ఎంతో శోభ ఉంటుంది ఆ మాటలో - ఆయన అంటారు
The Vedantic Generalizations are Most Universal & Marvelous Generalization
అది విన్నప్పుడే నాకు ఆనందం అనిపించింది, ఎంత బాగా గుర్తించారు ఈయన
అని. ఎందుకంటే వేదాంతంలో ఆ Generalizations అన్నీ కూడా మొత్తం
విశ్వమునంతటినీ తనలో ఇముడ్చుకొని, ఇంక ఏదీ బయట మిగలకుండా
Generalize చేస్తామంటే కొంత వచ్చింది, కొంత రాలేదు ఇంక అలా ఏమీ ఉండదు
Everything, the Entire Universe is included in that Generalization
సామాన్య సూత్రాలు - అటువంటి సామాన్య సూత్రాలు, వేదాంతంలో ఉన్నంత
అద్భుతంగా ఇంక ఎక్కడా Human History లో
కనపడవు. You see this

"The Entire Universe is 3 fold It canbe Reduced to 3"



| MAY 2019 | | | | | | |
|---|---|---|---|---|---|---|
| M | T | W | T | F | S | S |
| • | • | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | 31 | • | • |

→ 3 దాన్ని విడదీయవచ్చు, Distill చేయవచ్చు. ఏమిటా మూడు అంటే

1) Intelligence - జ్ఞానము = జంతువులో మరియు వృక్షాలలో చూసిన జ్ఞానమే

Eg:- particle, water chemistry - ఇంకొక్క Entire Universe has intelligence - వర్షాలు, ఋతువులు,

2) Activity - జగత్తులో Activity ఉంది - Particle అంటే ప్రతిఒక్కటిగా కదులుతూ ఉంది - Intense Activity. Entire Universe is full of Activity - క్రియ

3) ద్రవ్యం - Material

ఈ మూడింటికి మూలంలో ఒక మహాశక్తి ఉంది. మూడింటికి మూలం లో మహాశక్తి ఉన్నది గనుక ఆ మహాశక్తిలో మూడు అంశాలు ఉండాలి so that these three have originated from that single source.

→ Single source నుంచి మూడు వచ్చాయంటే, ఆ single source of there must be three aspects which are responsible for these three products/Effects

→ జ్ఞానానికి Source సత్త్వము (సత్త్వ గుణము)

→ క్రియా శక్తికి మూలము రజోగుణము

→ ద్రవ్యానికి మూలము తమోగుణము.

→ సూక్ష్మ, స్థూలాలు that settle & Gross - తమోగుణం - ద్రవ్యం - Gross

జ్ఞానము - సత్త్వగుణం - Most settle

In between రజస్ - It is settle as well as gross

You can not have activity without the object, but Activity itself is settle, It is a bridge b/n సత్త్వ & తమస్సు. that is రజస్.

→ "సత్త్వ రజస్ తమోగుణాః మాయా".

Wk. 23 → one should enter into rituals at a certain rituals according to the given situations in life & then grow out of them. ఋషి ఈ విధంగా మహాత్ములు బోధిస్తారు.

→ శ్రీకృష్ణుడు కూడా More or less he is going to say the same కానీ అర్జునుడు మాట్లాడే మాటలు Ritualistic mind లో మాట్లాడాడు. తర్పణాలు, పిండాలు పెట్టకపోతే మన పూర్వీకులు ఏమి అవుతారు అనే పెద్ద issue కింద మాట్లాడాడు. That is an issue. for people with a given mind set that is an issue, by all means it is an issue But it is a small issue it does not need an elaborate discussion & all that.

→ శ్రీకృష్ణుడు కనుక He is not going to reply for this this is the point

## "శ్రీ శంకర భాష్యము"

→ అజ: అవ్యయః - ఈశ్వరునికి పుట్టుక లేదు, నాశనము లేదు. అజః, అవ్యయః: కాబట్టి పుట్టినది దేహము, నశించేది దేహము. ఈశ్వరునికి పుట్టుక లేదు, నాశనము లేదు. జీవునికి పరిస్థితి కూడా అంతే జీవునికి కూడా పుట్టుకా లేదు, నాశనము లేదు. జీవుని విషయములో కూడా నశించేది దేహము అటువంటి ఈశ్వరునికి జీవునికి తేడా ఏముంది అంటే, తేడా ఇంతే మాయా వశీకృతః. ఆ మాయని వశములో ఉంచుకున్నవాడు ఈశ్వరుడు మాయకి లొంగిపోయినవాడు జీవుడు ఇంతేతేడా.

→ Suppose you say మాయ నుంచి బయట పడటం ఎలాగ? అంటే జ్ఞానము మాయ అజ్ఞానం రూపంగా ఉంటుంది. జ్ఞానం వల్ల నేను ఈశ్వరుణ్ణి అవుతానా? yes. that is how it is. As simple as that

→ తరువాత ఈశ్వరుని గురించి ఇంకో మాట అన్నారు వారు. నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావః. ఇది శంకరులకి నచ్చిన సమాసము He is the first one to coin that సమాసం. నిత్య శుద్ధ, బుద్ధ ముక్త స్వభావః. It is such a beautiful సమాసం తరువాత సాహిత్య గ్రంథాలలో, వేదాంత గ్రంథాలలో చాలా popular అయిపోయింది ఆ మాట. ఈ ఆత్మ స్వరూపము ఉన్నదే. ఆత్మ, (or) బ్రహ్మ what ever, అది దాని స్వభావము

దాని Innermost nature Intrinsic nature, స్వభావము అంటే
స్వరూపము అని అర్థం అన్నట. ఏమిటి అంటే నిత్య శుద్ధము. నిత్య బుద్ధము,
నిత్య ముక్తము ఈ మాటలు Correct గా మనం అనుకునేదానికి పూర్తి opposit
→ ఇప్పుడు మనం ఏమనుకుంటాం. నేను పాపాలు అన్ని చేశాను నాలో ఈ పాపాలు
అన్నీ నేను పోగొట్టుకోవాలి. పాపాలు ఎలా పోగొట్టుకోవాలి? దానం చేసి
పాపాలు పోగొట్టుకోవచ్చు. అందుకనే మనిషి దానం చేస్తాడు. పాపాల్ని
పోగొట్టుకోవటం కోసం. సాధారణంగా Business people, వ్యాపారాలు చేసి ఇల్లీ
గల్ గా ధనం సంపాదించేవాళ్ళు ఉంటారు. వాళ్ళు ఓ కొంత డబ్బు దానం
చేస్తారు. ఎందుకంటే వాళ్ళు Business చేస్తుంటే వాళ్ళకి తెలుస్తుంది. మనం
కొంచెం అన్యాయాలు, అక్రమాలు చేస్తున్నాం నడిపిస్తున్నాము అని వాళ్ళకి
తెలుస్తుంది. అది తెలుసున్న వాళ్ళు నేను చెబుతున్నాను. [illegible]
పట్టుకునేందుకు వాడు వెళ్ళి clubలు చుట్టూ తిరుగుతాడు. ఈ డబ్బు ఎలా
తీసుకెళ్ళి club లో పోస్తాడు. అది తెలిసున్నవాళ్ళు ఏం చేస్తారంటే,
ఎవళ్ళో మోసాలు చేస్తున్నవాళ్ళు చూసుకొని ఆయనకి cheques రాసి ఇస్తూ ఉంటారు.
→ ఈ Sentiment అనేది ఉంటుంది మనిషిలో, ఆ sentiment ని
Exploit చేయటం కోసం సిద్ధంగా మహానుభావులు ఉంటారు. ఎప్పుడూ
కూడా Socity finds, its own way. So there is a gentleman
who is a business man & He has some money to dispose
off అది % ఉంటుంది. ఆ Dispose off చేసేటప్పుడు వెంకటేశ్వర
స్వామి is permanent Resipient వెంకటేశ్వర స్వామికి ఆ వచ్చే
ఆదాయంలో ప్రత్యక్షమైన ఆదాయంలో ఉండే Sentiment ఇది. Certain
% అసలు Book open చేసినప్పుడు Accont Book దాంట్లో ముందు
వెంకటేశ్వర స్వామి వాటా 1%. Venkateshwara swami is the
share holder in thousands of Companies. & Every year,
ప్రతి Bank లో వెంకటేశ్వర స్వామి Account లోకి డబ్బు అలా వచ్చి
పడిపోతూ ఉంటుంది. వీళ్ళు ఏం చేస్తారంటే certain Amount మొదట
కింద వాటికి తీసుకుంటా వెంకటేశ్వర స్వామికి కట్టేస్తారు. కట్టేసి
దాన్ని Books లో చూపిస్తారు, B/S వెంకటేశ్వర స్వామి is taken as
one of the share holder & Government
It has given Incometax exemption to వెంకటేశ్వర స్వామి.
→ so ధనము వల్ల పాపాలు పోవటం అనే ఒక Spirit which
is fair enough. అలాగే ఒకప్పుడు ఈ వెంకటేశ్వర స్వామి

స్నానంలో ఒక మహాత్ముడు వచ్చినాడు. ఈ
మహాత్మునికి Routine గా కొంత ధనాన్ని ఇచ్చేస్తుంటే ఆయన ఆయుష్షు
లో చెంబెడు చేసుకుంటాడు. మనకి ఒక తృప్తి ఈ విధంగా దాన రూపంగా
దోషాలకి నివారణ చేసుకోవచ్చు
→ తరువాత నది స్నానము, ఇలాగ ప్రాయశ్చిత్త కర్మలు ఇలా ఎన్నెన్నో
ఉన్నాయి. అంటే వేదాంతంలో చెప్పేది వీటన్నింటికి అతీతంగా ఉండాలి
అన్నది they have their place As long as you feel that
there is some blemish in you మీలో ఏదో దోషము ఉంది
అనుకున్నంత సేపు అవి సహకరిస్తాయి. కానీ మీరు తెలుసుకోవలసింది
ఏమిటంటే మీ స్వరూపములో ఏ దోషము లేదు. నిత్య శుద్ధము. You
need not become pure. because you are ever, ever pure
అది సనాతనకి వాటికి Difference వచ్చేసింది చూడండి.
→ In Religion - You have to become pure, you are impure
& you have to become pure. In spirituality you are
ever, ever pure అని కానీ ఒక శ్లోకం ఒకటి ఉంది అది
మేము చెప్పము. మా పూజలో ఈ శ్లోకం మేము చెప్పము.
"పాపోహం, పాపకర్మాహం, పాపాత్మా, పాప సంభవః", ఈ శ్లోకం
ఉంది చూశారా. It is wrong all the way. పాప సంభవః లో
ఇలాంటివి చాలా ఉన్నాయి. ఇది this is the Influence of
christianity on hindu ధర్మ. We do not Accept it
నేను విన్నాను, సాయిబాబా గారు కూడా ఈ శ్లోకం చెప్పేవారని ఆయన
భక్తులకు అది నేర్పారని ఎవరో చెప్పగా విన్నాను నేను. వాళ్ళు చెప్పారు
సాయిబాబా భక్తులు ఉంటారు చూడండి వాళ్ళు చెప్పారు ఈ శ్లోకం.
ఆయన చెప్పేవాడని చెప్పారంట ఎప్పుడో ఒకసారి చాలా తప్పు ఇది
ఈ శ్లోకం. ఈ శ్లోకం మేము చెప్పము. ... ఇది - కానీ మీరు మీ
పురోహితుల్ని అడిగి చూడండి Routine గా ఈ శ్లోకం చెప్తారు
→ తరువాత ఒకసారి ఒక పెద్ద వేద పండితుడు నేను ఒకే సభ వేదిక
share చేసుకున్నాము. ఆయన ఉపన్యాసము చెప్పారు, నేను చెప్పాను
నేను దత్తాత్రేయ కథలో విషయాలు చెప్పాను. ఆయన ఉపదేశంలో
Assignment కారణం ఏమిటంటే. Priority మీరు ఎంత పాపాత్ములు
ఈ పాపాలకి మీరు కట్టుకోవాలి. అదే కారణము
So Religious mind vs Spiritual mind. There
is a huge difference

ఉంటుంది. కానీ మీ స్వరూపము లో అజ్ఞానము ఉండదు.
ఎందుకంటే స్వరూపము ఆ Intellect లో ఉండే జ్ఞానాన్ని
అజ్ఞానాన్ని కూడా సమానంగా ప్రకాశింప చేస్తుంది. ఇప్పుడు మీ 17వ
సంవత్సరం వచ్చినదనుకోండి. ఆ 17వ ఏడాన్ని చక్కగా ప్రకాశింపచేస్తుంది
ఆత్మ చైతన్యం. Suppose 17వ వర్షం వచ్చినవాడు నాకు 20వ
వరకు ఏమేమి కష్టపడ్డాడు ఉన్నమాట చెబుతున్నాను. 17వ
వర్షం రాలేదు అంటే ఆ సంగతి మీకు స్పష్టంగా తెలుస్తుంది. 17వ
వర్షం వచ్చిందో లేదో అనే సందేహం కూడా స్పష్టంగా తెలుస్తూ ఉంటుంది
→ అజ్ఞానము తెలుస్తూ ఉంటుంది. ఒక వేళ సందేహం ఉంటే ఆ
సందేహం తెలుస్తూ ఉంటుంది. జ్ఞానం ఉంటే ఆ జ్ఞానం తెలుస్తూ ఉంటుంది
కాబట్టి తెలుస్తూ ఉంటుంది అది ఆత్మ యొక్క లక్షణము.
తెలిసిన ఆత్మ యొక్క లక్షణము. ఆ తెలివిలోనే జ్ఞానము ప్రకాశిస్తుంది
అజ్ఞానము ప్రకాశిస్తుంది, సందేహము ప్రకాశిస్తుంది. సందేహము ఉంది
అంటాము. సందేహం ఉంది అనే సంగతి తెలిసింది కదా. అజ్ఞానం
అంటాము. అజ్ఞానం అనే సంగతి తెలిసింది కదా! జ్ఞానం కూడా. జ్ఞానం
అనే సంగతి తెలిసింది కదా. So you are the Knower to the Known,
unknown & Doubt also. So మీ స్వరూపము Knower బుద్ధి
సాక్షి బుద్ధి:

→ సాక్షి వస్తు: మీరు మీన్ని కొత్తగా పొందనక్కరలేదు. you need not gain freedom afresh. freedom is with you you have to discover it అంతే.

Eg. ఇప్పుడు Iraqis వాళ్ళు ఉన్నారు they need a freedom. freedom కొరకు ఏదో ఏదో పోట్లాడుతున్నారు. Political freedom కావాలి. physical freedom. physical freedom అంటే గదిలో పెట్టి తాళం వేయటం, లేదా Lift లో ఆగిపోవటం etc. political freedom. Eg. Voter list లో Name లేకపోతే political freedom is gone. But ఇవి Important. physical freedom is important for the growth of a person అలాగే political freedom కూడా Important. అవి Unimportant అని నేను చెప్పటం లేదు. But they are not the subject matter of Vedanta. వేదాంతం యొక్క subject matter is the Inner freedom